# బాలిక అంటే ఏమిటి?

# బాలుడు అంటే ఏమిటి?

కమ్లా భసీన్

బొమ్మలు : బిందియా థాపర్

| | |
|---|---|
| **What is a girl? What is a boy?** | బాలుడు అంటే ఏమిటి? బాలిక అంటే ఏమిటి? |
| First Edition 1997 | మొదటి ప్రచురణ 1997 |
| Second Edition 1998 | రెండవ ప్రచురణ 1998 |
| Telugu Edition 2001 | తెలుగులో ప్రచురణ 2001 |
| Originally published by | ప్రచురణ కర్త |
| **Jagori**, New Delhi 110 049 | **జాగోరి**, న్యూఢిల్లీ 110 049 |
| Telugu version published by | తెలుగులో ప్రచురణ కర్త |
| © *BOOKSLINE* | © ***బుక్స్‌లైన్*** |
| B-45, Maheshwari Towers | బి-45, మహేశ్వరి టవర్స్ |
| Road 1 Banjara Hills, Hyderabad | రోడ్ 1, బంజారాహిల్స్, హైదరాబాద్ |
| Telephone 040 657 8506, 335 6210 | ఫోన్ 040 657 8506, 335 6210 |

*Published under BOOKS FOR ALL Programme*

**ISBN : 81-87102-07-1**

**Price : Rs.28/-**


# ముందుమాట

స్వాతంత్ర్యం వచ్చిన ఏభైయ్యేళ్ళ తరువాత కూడా దేశంలో ఆడపిల్లలు, స్త్రీలు ద్వితీయ శ్రేణి మనుషులుగానే చూడబడుతున్నారు. ఆడపిల్ల పుడితే ఉత్సవాలు జరపడం చాలా అరుదు. ఆడపిల్లకు ప్రేమానురాగాలు, సంరక్షణ, పోషకాహారం, ఆరోగ్య రక్షణ తగిన స్థాయిలో లభించట్లేదు. పెరుగు మగపిల్లలకు, మజ్జిగ ఆడపిల్లలకు అన్నట్లుంది పెంపకం. కొన్ని కుటుంబాల్లో ఆడశిశువుల్ని పుట్టకముందే చంపేస్తున్నారు.

కుటుంబంలో ఉన్న ఈ దారుణమైన వివక్ష, దురన్యాయం ఎంతో ఆందోళన కలిగిస్తుంది. ఎందుకంటే దీనివల్ల బాలికలకే కాదు, కుటుంబానికీ మొత్తం సమాజానికీ కూడా హాని కలుగుతుంది. పొలంలో నగం పైరు మాత్రమే ఏపుగా ఉంటే ఏ రైతైనా సంతోషంగా ఉండగలుగుతాడా? మరి, తమలో సగం మంది ఆరోగ్యంగా లేకుండా సుఖసంతోషాలు లేకుండా విద్యావకాశాలు లేకుండా ఉంటే కుటుంబాలూ సమాజాలూ ఆనందంగా ఎలా ఉండగలుగుతాయి?

ఈ పరిస్థితులను సవాల్ చేయవలసిన, మార్చవలసిన అవసరం ఉందని మేం నమ్ముతున్నాం. ఈ దిశలో కార్యాచరణ కోసం పరిస్థితులు అలా ఎందుకున్నాయో అర్థం చేసుకోవలసి ఉంది. స్త్రీ పురుషుల మధ్య నెలకొని వున్న భేదాలు, అసమానతలూ ప్రకృతి సృష్టించినవనీ సహజమైనవనీ కొందరనుకుంటారు. ఇది వాస్తవమేనా? లేక ఈ భేదాలు, అసమానతలూ సమాజం సృష్టించినవా? బాలబాలికల లక్షణాలు,

ప్రవర్తనా పద్ధతులు, ఇష్టాయిష్టాలు, నైపుణ్యాలు, ఎంచుకునే జీవన మార్గాలనూ నిర్ణయించింది ప్రకృతా? లేక మనమందరమూ సభ్యులమైన ఈ సమాజమా?

భవిష్యత్‌లో మన ఆడపిల్లలు అటువంటి వివక్షకూ దురన్యాయానికీ గురికాకూడదనీ మన మగపిల్లలు ముందే నిర్ణయించిన మూసపాత్రల్లోకీ, నమూనా ప్రవర్తనా పద్ధతుల్లోకీ నెట్టబడకూడదనీ మన కుటుంబాలు న్యాయబద్ధంగా శాంతియుతంగా ఉండాలనీ, ఆడపిల్లలకైనా మగపిల్లలకైనా ఎదుగుదలకు సమానమైన అవకాశాలు కల్పించేవిగా ఉండాలనీ ఆశిస్తూ మేము ఈ పుస్తకం ద్వారా అలాంటి ప్రశ్నలపై చర్చను ప్రేరేపించేందుకు ప్రయత్నించాం. ఈ పుస్తకాన్ని మీరు ఇష్టపడతారనీ ఇది ఉపయోగకరమైందిగా భావిస్తారనీ మేం ఆశిస్తున్నాం.

ఈ పుస్తకానికి రూపకల్పన చేయడంలో దీన్ని సృష్టించడంలో నా స్నేహితురాలు రీతూ మీనన్ ప్రమేయం చాలా ఉంది. జూహీ జైన్ జాగోరీ బృందం వారూ చాలా విషయాల్లో సాయం చేశారు. మన జీవితాలు న్యాయబద్ధమై ఆనందదాయకం కావడానికి తోడ్పడే ఇటువంటి స్నేహసహకారాలకు ఈ పుస్తకాన్ని అంకితం చేస్తున్నాను.

కమ్లా భసీన్
డిసెంబర్, 1998





## బాలుడు అంటే ఏమిటి?
## బాలిక అంటే ఏమిటి?



**శిశువు పుట్టినపుడు బాలిక కావచ్చు, బాలుడు కావచ్చు.**

బాలిక అంటే ఏమిటి?





పొడవాటి జుట్టుంటే బాలికని కొందరంటారు.



మరి బాలాజీకి పొడవాటి జుట్టుంది, అయినా అతను బాలుడు.

నగలు పెట్టుకుంటే బాలిక అని కొందరంటారు.



శివకు మెళ్ళో గొలుసుందీ, చెవులకు
పోగులున్నాయ్. అయినా అతడు బాలుడే కదా.





బాలుడంటే ఏమిటి?



పొట్టి లాగులు తొడిగే వాళ్ళూ, చెట్లెక్కేవాళ్లూ బాలురని కొందరంటారు.



శాంతి పొట్టి లాగులు తొడుగుతుందీ, చకచకా చెట్లెక్కుతుందీ అయినా ఆమె బాలికే.



పుష్టిగా ఉండేవాళ్ళూ, బరువులు మోయగలవాళ్ళూ బాలురని కొందరంటారు.



సయిదా, నిర్మల రెండేసి నీళ్ళ కడవలు మోస్తారు, పెద్దపెద్ద వంటచెరుకు మోపులూ మోస్తారు. వాళ్ళు బాలికలే మరి.

ఇంటిపనిలో సహాయపడేవాళ్ళు బాలికలని కొందరంటారు?



మరి, జోసెఫ్ ఇంటి పనిలో, వంటపనిలో సాయం చేస్తాడు, అతడు బాలుడే.



పొలాల్లో పనిచేసే వాళ్ళు పురుషులు, బాలురు అయి ఉంటారని కొందరంటారు.



నఫీసా వాళ్ళమ్మా పొలం పనులు చేస్తారు. వాళ్ళు స్త్రీలే మరి.

బజార్లో, అంగట్లో వ్యాపారం చేసేవారు పురుషులని కొందరంటారు.



బజారులో చేపలమ్ముతుంది - మీనా. ఆమె బాలిక.



సున్నితమైన స్వభావం కలవాళ్ళూ తల్లిలా మమతానురాగాలు పంచేవాళ్ళూ బాలికలని కొందరంటారు.



శ్యామ్ సున్నితమైన వాడు. తల్లిలా ప్రేమ చూపిస్తాడు. చెల్లెలి ఆలనా పాలనా తనే చూస్తాడు. అతను మరి బాలుడు.

సమాజంలో వ్యవహారాలు నిర్వహించగలవాళ్ళు పురుషులని కొందరంటారు.



శారద - జిల్లా కలెక్టర్. ఆమె జిల్లా వ్యవహారాలన్నీ దక్షతతో నిర్వహిస్తోంది. ఆమె ఒక మహిళ.



మరి బాలుడేమిటి? బాలికేమిటి?



పురుషాంగం, వృషణాలూ ఉంటే బాలుడు. యోనీ, యోనిశీర్షం ఉంటే బాలిక.



ప్రతి బాలుడూ పెరిగి పెద్దవాడై పురుషుడవుతాడు.
ప్రతి మగాడికీ పురుషాంగం, వృషణాలూ ఉంటాయి.
ప్రతిబాలికా పెరిగి పెద్దదై స్త్రీ అవుతుంది.
ప్రతి స్త్రీకీ యోని, గర్భాశయం, స్తనాలూ ఉంటాయి.
శిశువు స్త్రీ శరీరంలో రూపుదిద్దుకుంటుంది. స్త్రీ శిశువుకి జన్మనివ్వడమే కాక చనుబాలిచ్చి పెంచుతుంది.



ఈ శారీరక భేదాలు తప్ప, బాలబాలికలు మరే రకంగానూ వేరువేరు కాదు. నిజానికి ఆడపిల్లల, మగపిల్లల శరీరాల్లో భేదాలకన్నా పోలికలే ఎక్కువ వున్నాయి. కేవలం లైంగికమైన, పునరుత్పత్తికి సంబంధించిన అవయవాలు మాత్రమే భిన్నంగా ఉన్నాయి. మిగతా అవయవాలన్నీ ఒకేలాగున్నాయి.





జీవ సంబంధమైన శారీరకమైన ప్రత్యేక నిర్మాణాన్ని లింగం లేదా **సెక్స్** అంటారు. వారి ప్రత్యేక శారీరక నిర్మాణం వల్ల బాలురు లింగపరంగా పురుషులవుతారు. బాలికలు లింగపరంగా స్త్రీలవుతారు.



ఈ జీవసంబంధమైన శారీరకమైన విభేదాలు ప్రకృతి కల్పించినవి. ఈ రకమైన భిన్నత్వాలు ప్రతి కుంటుంబంలోనూ, ప్రతి సమాజంలోనూ, ప్రతి దేశంలోనూ ఉన్నాయి. అంటే బాలుడు ప్రపంచంలో ఎక్కడైనా ఒకటే. అలాగే బాలిక ప్రపంచంలో ఎక్కడైనా బాలికే.

శారీరక భేదాలు కాకుండా బాలబాలికల మధ్య వస్త్రధారణ, ప్రవర్తన, విద్య, వారిపట్ల సమాజ దృక్పథం లాంటి భేదాలేవైతే ఉన్నాయో అవన్నీ సాంఘిక సాంస్కృతిక భేదాలే కానీ సహజమైనవి కావు. అందువల్లనే ఈ సాంఘిక సాంస్కృతిక భేదాలు ప్రతి కుటుంబంలోనూ, ప్రతి సమాజంలోనూ ఒకే రకంగా ఉండవు.



కొందరు బాలికలు పొడవాటి జుట్టు కలిగి ఉంటే, కొందరు పొట్టిజుట్టుతో ఉంటారనీ - కొన్ని కుటుంబాల్లో మగపిల్లలు ఇంటిపనిలో సాయం చేస్తారనీ కొన్ని కుటుంబాల్లో చేయరనీ, కొందరు స్త్రీలు ఇంటికే పరిమితమై పనిచేస్తే మరి కొందరు బయట సమాజంలో పనిచేస్తారనీ - మొదలైన అంశాలు మనం ఇంతకు ముందే గమనించాం.



ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ ఈ విధంగా సమాజపరంగా సంస్కృతిపరంగా ఆపాదించిన నిర్వచనాలనే **'జెండర్'** అంటారు.



ఉదాహరణకు ఆడపిల్లలు ఇంట్లోనే ఉండాలనీ, మగపిల్లాడు బయట తిరగొచ్చనీ లేదా ఆడపిల్లలకు మగపిల్లలకన్నా తక్కువ ఆహారం, ఆటలకు తక్కువ సమయం ఇవ్వడం; మగపిల్లాడు పెరిగి పెద్దవాడై మంచి ఉద్యోగం సంపాదించి కుటుంబ వ్యవహారాలు నిర్వహిస్తాడనే ఉద్దేశ్యంతో వాడిని మంచి స్కూల్లో చేర్పించడం అదే సందర్భంలో ఆడపిల్ల చదువుపట్ల అంతగా శ్రద్ధ చూపకపోవడం వంటి నియమాలను సమాజం ఏర్పరుస్తుంది.



ఈ జెండర్ విభేదాలు ప్రకృతి సృష్టించినవి కావు, సహజమైనవి కావు. ప్రకృతి కేవలం విభిన్న అవయవ నిర్మాణాలతో ఆడవారినీ, మగవారినీ సృష్టిస్తుంది. సమాజం వారికి జెండర్‌ని ఆపాదించి వారిని స్త్రీ పురుషులుగా మారుస్తుంది.



సామాజిక నిర్వచనాలవల్ల బాలబాలికల మధ్య తేడాలు పెరిగిపోతూనే ఉన్నాయి. ఆడపిల్లలూ మగపిల్లలూ పూర్తిగా భిన్నమైన రెండు వేరువేరు ప్రపంచాలకు చెందిన వారనిపిస్తుంది.





బాలబాలికల మధ్య స్త్రీపురుషుల మధ్యా అసమానతలను సృష్టిస్తున్నది - జెండర్. పురుషుడు ఎక్కువ - స్త్రీ తక్కువ, పురుషుని పనికి వేతనం ఎక్కువ - స్త్రీకి తక్కువ. పురుషుడు శక్తిమంతుడు, స్త్రీ శక్తిహీనురాలూ లాంటి నిర్ణయాలు చేసింది - సమాజం. (లేదా సమాజంలో భాగమైన మనమంతా).



అసమానతలను ప్రకృతి సృష్టించలేదు. పునరుత్పత్తి కోసం ప్రకృతి ప్రత్యేకమైన అవయవాలను కల్పించింది. అసమానతలు, అంతస్తులు, ఆచారాలను సమాజం అంటే మనమంతా సృష్టించాం. ఉన్నవారూ-లేనివారూ, బ్రాహ్మణులు-శూద్రులూ, నల్లవారూ-తెల్లవారూ, పురుషులూ-స్త్రీలూ అనే విభేదాలు సమాజం సృష్టించినవేకానీ ప్రకృతి, దేవుడు సృష్టించినవి కావు.



నిజానికి మనందరిలోనూ పురుషుడూ ఉన్నాడు, స్త్రీ కూడా ఉంది. కానీ, బాలికలో పురుషుడు ఉండడాన్నీ, బాలునిలో స్త్రీ ఉండడాన్నీ సమాజం అంగీకరించదు.



బాలబాలికల మధ్య పోలికలనూ సామ్యాలనూ ప్రోత్సహించడానికి బదులు ఈ సమాజాలూ సంస్కృతులూ భేదాలను పెంచిపోషిస్తున్నాయి. అందుచేతనే బాలబాలికలు భిన్నరీతుల్లో పెరుగుతారు, వారి మార్గాలు వేరువేరుగా ఉన్నాయి. ఈ అసమానతలే స్త్రీ పురుషుల మధ్య ఉద్రిక్తతలకూ ఘర్షణలకూ కారణమవుతున్నాయి.



ప్రపంచవ్యాప్తంగా జెండర్ భేదాలు ప్రధానంగా పితృస్వామికమైనవి. అంటే- అవి పురుషాధిపత్యంతో కూడినవి, పురుషునిపరంగా పురుషునికి అనుకూలమైనవిగా ఉన్నాయి. జెండర్ భేదాలు స్త్రీకి వ్యతిరేకమైనవిగా ఉండడం వల్ల ఆడపిల్లలు ఎన్నో అవరోధాలను ఎదుర్కొంటున్నారు. వివక్షతకూ హింసకూ గురవుతున్నారు.



ఈ కారణాలవల్లనే ఆడపిల్లలు అభివృద్ధిలోకి రాలేకపోతున్నారు. మగపిల్లల మాదిరిగా వాళ్ళ ప్రతిభాపాటవాలనూ, నైపుణ్యాన్నీ పెంచుకోలేక పోతున్నారు. ఒకే కుటుంబంలో కూడా మగ పిల్లలు అభివృద్ధిలోకి రావడాన్నీ ఆడపిల్లలు అణగారిపోవడాన్నీ మనం గమనించవచ్చు.

ఇలాంటి జెండర్ భేదాలు కేవలం బాలికలకు మాత్రమే హాని చేయడం కాదు, మొత్తం కుటుంబానికీ సమాజానికీ దేశానికీ హాని చేస్తున్నాయి. బాలురపై కూడా మూసపోసినట్టు ఒకే రకమైన జీవిత నమూనాల లక్షణాల బాధ్యతల భారం పడుతోంది. వారు కూడా జెండర్ అనే జైల్లోని ఖైదీలే అవుతున్నారు.



జెండర్ అనేది సామాజికమైనది గనుక, మనమంతా సృష్టించిందే గనుక బాలబాలికలంటే, పురుషులంటే నూతన నిర్వచనాలు సృష్టించడం ద్వారా మనం కావాలనుకుంటే జెండర్‌ని మార్చగలుగుతాం. ఆడపిల్లలంటే తక్కువ వాళ్ళుగా బలహీనులుగా మిగిలిపోని; మగపిల్లలంటే కఠినంగా ప్రవర్తించే వారూ, పెత్తనం చెల్లాయించేవారూ, హింసకు పాల్పడేవారూ కానవసరం లేని సమాజాన్ని మనం సృష్టించుకోవచ్చు.



వాస్తవమేమిటంటే ఆడపిల్లలూ మగపిల్లలూ వాళ్ళకెలా కావాలంటే అలా వస్త్రధారణ చేసుకోవచ్చు, ఆడుకోవచ్చు, చదువుకోవచ్చు. వాళ్ళకి కావలసిన రీతిలో పెరగవచ్చు. శారీరకంగా ఆడపిల్లయినంత మాత్రాన ఇంటి పనికే పరిమితం కావాలనీ ఇతరులకు సేవలు చేయాలనీ లేదు.



శారీరకంగా మగపిల్లాడైనంత మాత్రాన భయం లేకపోవడం, ప్రతిభాపాటవాలు, బలం కలిగి ఉండడం లాంటి లక్షణాలు ఉండి తీరుతాయనీ లేదు. ఈ లక్షణాలన్నీ అభ్యాసంతో సాధనతో సమకూరుతాయి. ఎవరు ఎలా పెరుగుతారు, ఏమవుతారూ అనేది వాళ్ళ పెంపకంపై ఆధారపడి ఉంటుంది.

మనం కావాలనుకుంటే జీవిత నమూనాలూ చట్రాలూ, లక్షణాలూ, నైపుణ్యాలూ, బాధ్యతలూ, ప్రవర్తనా పద్ధతులూ, జెండర్, కులం, వర్గం, జాతి మొదలైన వాటిచే నియంత్రించబడని సమాజాన్ని నిర్మించుకోవచ్చు. నచ్చిన జీవన మార్గాన్ని



ఎంచుకునే స్వేచ్ఛ, ప్రతిభాపాటవాలను అభివృద్ధి చేసుకునే స్వేచ్ఛ, ఇష్టప్రకారం జీవించే స్వేచ్ఛగల సమాజాన్ని మనం కావాలనుకుంటే సృష్టించుకోవచ్చు.





## చర్చను ప్రేరేపించడానికి కొన్ని సూచనలు

జీవించడానికి రెండు మార్గాలున్నాయి. ఒక పద్ధతి ఏమిటంటే - ఇప్పటికే ఉన్న సంప్రదాయాలను ప్రశ్నించకుండా బతకడం. అవి అలా ఎందుకున్నాయో ప్రశ్నించకుండానే వాటిని అంగీకరించడం, ఆచరించడం, స్థిరీకరించడం.

మరో పద్ధతి ఏమిటంటే మనం చేస్తున్న దాని గురించి ఆలోచించి అర్థం చేసుకొని చేయడం. ఆచారాలు ఉన్నాయి గదా అని వాటినలా అనుసరించడమేనా అని ప్రశ్నించడం, ఏర్పరచిన నియమాలను గుడ్డిగా ఆచరించకుండా ఆ సంప్రదాయాలు, ఆచారాలూ అందరికీ మంచివీ ప్రయోజనకరమైనవీ అయితేనే వాటిని ఆచరించడం.

జ్ఞానం కలిగి ఉండి, అన్నీ తెలుసుకుని బతకడం మంచిదనీ అందులోనే ఆనందం ఉందనీ మేమనుకుంటాం. ఇలా చేయడం వల్ల మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా మనం మారగలుగుతాం. మనకీ మన పరిసరాలకీ మధ్య మరింత సామరస్యం సాధించగలుగుతాం. మనం చైతన్యవంతులమై, ప్రశ్నించగలిగేంత ధైర్యవంతులమైతే సమాజాన్ని సృషించే హక్కూ, సమాజాన్ని మార్చే హక్కూ మరెంతో కాలం కొద్ది మందికే పరిమితమై ఉండదు.

కుటుంబంలోనూ సమాజంలోనూ స్త్రీపురుషుల హోదా, వారి మధ్య సంబంధాలూ అనే అంశంపై కొంత చర్చ జరిగింది. దీనిపై మరింతగా చర్చా, పునరాలోచనా జరగాల్సి ఉంది.

ఈ అంశంపై తదుపరి చర్చకోసం ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో ఈ పుస్తకాన్ని రూపొందించడం జరిగింది. దిగువ పేర్కొన్న ప్రశ్నల్లాంటి మరిన్ని ప్రశ్నలు పుట్టడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుంది.

బాలుడు-బాలిక, స్త్రీ-పురుషుడు అనే వాటికి నిర్వచనాలు ఏమిటి? వారి మధ్య భేదాలేమిటి? వారి జీవితాలు, కార్యరంగాలు, లక్షణాలు నైపుణ్యాలు, ప్రతిభాపాటవాలు భిన్నంగా ఉండడం అవసరమా?

భేదాలు అవసరమైనవే అయితే వారు అసమానతలతోనూ ఉండాలా? భిన్నత్వంలో సమానత్వం ఉండడం సాధ్యం కాదా? విభేదాలున్నప్పటికీ స్త్రీపురుషుల ప్రతిభాపాటవాలకూ వారు చేసే పనికీ ఒకే విలువ, గౌరవం, హోదా కల్పించడం కుదరదా?

పిన్నలూ పెద్దలూ కూడా చిన్నచిన్న బృందాలుగా ఏర్పడి ఈ అంశాలపై చర్చించవచ్చు. ప్రజలు ఈ సమస్యలను తమ జీవితాలకూ పరిసరాలకూ అనువర్తించి చూసుకునేలాగా - ఈ చర్చలు దోహదం చేయాలి. ఉదాహరణకు మనం ఇలా అడగొచ్చు. ఆడపిల్లలెవరైనా పొట్టిలాగూలూ లేదా పైజామా-కుర్తా ధరిస్తున్నారా? దీనిపై ఇతరుల స్పందన ఏమిటీ? మగపిల్లలెవరైనా మెళ్ళో గొలుసు, చెవులకు పోగులూ ధరిస్తున్నారా, అలా చేయడం వల్ల వారు ఆడపిల్లలైపోతారా?

ఆడపిల్లలు చెటెక్కుతారా? ఎక్కకపోతే ఎందుకు ఎక్కరు? మీ ఇళ్ళల్లో కేవలం ఆడపిల్లలూ స్త్రీలూ మాత్రమే చేసే పనులు ఏమేం ఉన్నాయి?

ఆడపిల్లలకూ స్త్రీలకూ అప్పగించని పనులేమి ఉన్నాయి? అలా ఎందుచేత జరుగుతోంది? ఎవరి పని కష్టమైంది? ఎవరి పని కఠినతరమైంది?

ఆడుకోడానికి ఆడపిల్లలు బయటకెళతారా? మగపిల్లలు ఆడుకునేంత సమయం వారు బయట ఆడుకుంటున్నారా? మగపిల్లలూ ఆడపిల్లలూ ఒకేరకమైన ఆటలు ఆడుతున్నారా? ఆడపిల్లల్ని పాఠశాలకు పంపుతున్నారా? ఆడపిల్లలు గ్రామంలో స్వేచ్ఛగా నిర్భయంగా తిరగ్గలుగుతున్నారా? ఆడపిల్ల ఒంటరిగా ఉంటే ఆమె వేధింపులకు



గురవుతోందా? ఆడపిల్లలను వేధిస్తున్నది ఎవరు? ఈ వేధింపుల సందర్భంలో చుట్టుపక్కల వాళ్ళు ఏం చేస్తున్నారు?

ఒక స్వతంత్ర దేశంలో ఆడపిల్లలూ స్త్రీలూ గౌరవంగా స్వేచ్ఛగా జీవించే పరిస్థితి లేకపోవడం అంగీకారయోగ్యమవుతుందా? ఈ విషయంలో సమాజం ఎందుకు మౌనంగా ఉంది?

మన కుటుంబాల్లో ఆడపిల్లల్ని మగపిల్లల్నీ సమానంగానే పరిగణిస్తున్నామా? వారు సమానమైన స్థాయిలో ప్రేమాభిమానాలు, అవకాశాలు, గౌరవమర్యాదలూ పొందగలుగుతున్నారా? అలా జరక్కపోతే ఎందుకు జరగడం లేదు?

కుటుంబంలో ఏదైనా అన్యాయం జరుగుతూంటే వివక్ష కొనసాగుతూంటే దాని పట్ల మీ స్పందన ఏమిటి?

దాన్నలాగే కొనసాగిస్తూ మీరు మౌనంగా ఊరుకుంటారా? లేక ఆ పరిస్థితిని మార్చడానికి ఏదైనా ప్రయత్నం చేస్తారా?

మీ కుటుంబంలో దేన్నైనా మార్చడానికి మీరు ప్రయత్నించారా?

అయితే ఏమిటది?

దాని పట్ల మిగతా వారెలా స్పందించారు?

అదే విధంగా, మనం ఈ కింద పేర్కొన్న అంశాల్లాంటి మరికొన్ని అంశాలపై చర్చకు దోహదం చేయొచ్చు.

ఎందరాడవాళ్ళు బయటకెళ్ళి ఉద్యోగాలు చేస్తున్నారు? వారు చేసే పనులేమిటి? వారు పొందే వేతనాలెంత? వారి జీతాలు మగవారితో సమానంగా ఉంటున్నాయా?

డబ్బు సంపాదించే స్త్రీకి అధిక గౌరవం లభిస్తోందా?

సామాజిక రాజకీయ కార్యక్రమాల్లో స్త్రీలు పాల్గొంటున్నారా?

ఈ అంశాలు చర్చించినవారు, తమకు అన్యాయమనీ అవి మారాలనీ అనిపించిన అంశాల జాబితా తయారుచేయొచ్చు. ఈ తప్పులను సరిదిద్దడమెలాగా అని చర్చించవచ్చు.

అన్యాయం అనుకున్న అంశాలను మార్చేందుకు - చర్చించిన బృందం, కార్యాచరణకు పూనుకుంటే అంతకన్నా కావల్సింది లేదు.

ఈ అంశాలపైన, ఇతర అనుబంధ అంశాలపైనా మరింత సమాచారం కావాలంటే- న్యూఢిల్లీలోని జాగోరీ నుంచి గానీ ఇతర మహిళా బృందాల నుంచి గానీ పుస్తకాలు, పోస్టర్లు, వీడియో ఫిల్మ్‌లూ పొందవచ్చు.

ఆడా మగా భేదం లేకుండా పిల్లలంతా సర్వతోముఖాభివృద్ధి సాధించేందుకు వీలుగా బాలబాలికలకు సమాన అవకాశాలు కల్పించే కుటుంబాలూ సమాజాలూ ఏర్పడాలని మా కోరిక. మనలో చాలా మందికి ఇలాంటి ఆకాంక్షే ఉంటే దాన్ని నిజం చేయడానికి మనం ఎంతో కొంత చేస్తే - పరిస్థితులు తప్పకుండా మారతాయి. ఒక చిన్న సీతాకోకచిలుక రెక్కలల్లార్చితే కూడా పరిసర వాతావరణంపై దాని ప్రభావం ఉంటుందని శాస్త్రజ్ఞులు చెబుతారు. మనమంతా కలిసి చేసే ఉమ్మడి కార్యాచరణ వల్ల పరిస్థితుల్లో తప్పకుండా మార్పులొస్తాయి.

